"అడగవలసిన ప్రశ్నే అడిగావు" అంటూ అందుకున్నాడు వ్యాసముని — "నీసందేహం తీరుస్తాను. సావధానంగా విను. ఆదిదేవుడైన విష్ణుమూర్తి లోకసంరక్షణకోసం జన్మించి, మైనాకపర్వతం మీద మహాతపస్సు చేశాడు. గాలిమాత్రం ఆహారం చేసుకుని, చేతులు మీదికెత్తి ఘోరమైన నిష్ఠతో ఎంతోకాలం శివుణ్ణి ధ్యానించాడు. తుదకి ప్రసన్నుడయ్యాడు శివుడు. నెలవంక జడముడితోనూ, శూలమూ పినాకమూ మొదలైన ఆయుధాలతోనూ ప్రత్యక్షమయ్యాడు. సాష్టాంగ నమస్కారంచేసి నుంచున్నాడు విష్ణుమూర్తి. అంజలిబంధం నుదుట కీలించాడు. ఎన్నోవిధాల స్తోత్రంచేశాడు. "దేవా, ఎవ్వరికీలేని ప్రభావం నాకు ప్రసాదించు" అని ప్రార్థించాడు.

చల్లనిచూపు చూశాడు శివుడు. "మానవులూ, దేవతలూ, రాక్షసులూ, గంధర్వులూ, కిన్నరులూ, గరుడులూ — ఈ యావన్మందినీ, సర్వభూతాలనీ ఇట్టే జయిస్తావు నువ్వు. పరమతేజస్సుతో ప్రకాశిస్తావు. అస్త్రాలూ, శస్త్రాలూ, అగ్నీ, నీరూ, ఏదీ ఏమీచెయ్యలేదు నిన్ను. తడీ, పొడీ, స్థావరమూ, జంగమమూ ఏదీ నిన్ను బాధించలేదు. చావన్నది లేనేలేదు నీకు. అంతకీ వస్తే నన్నే జయింస్తావు" అని వరమిచ్చాడు. అందుకనే శ్రీమన్నారాయణమూర్తి గెలవరానివాడయ్యాడు. ఆనారాయణమూర్తిలోంచేపుట్టి నరుడుమూ అంతవాడే అయ్యాడు. నరనారాయణులు ఇద్దరూ ఒకళ్ళ విడిచిపెట్టరు. నరుడినేస్తం నారాయణుడు. నిజ మా జగన్మోహనుడై విహరిస్తాడతడు. ఆ ఇద్దరూ, ధా నికీ, ధర్మం స్థాపించడానికీ అవసరమైనప్పుడు

"తొలిజన్మలో నువ్వు మట్టితో ప్రతిమచేసి, అందులో పరమేశ్వరుణ్ణి ఆవహించి పూజించావు. వాళ్ళు లింగం ప్రతిష్ఠించి పూజించారు. ఎలాచేసినా పరమేశ్వరారాధన సర్వార్థాలూ సాధించి పెడుతుంది. అందులోనూ లింగపూజ ప్రతిమపూజకంటె శ్రేష్ఠమైంది. అంచేత లింగారాధనచేసిన కృష్ణార్జునుల్ని ప్రతిమారాధకుడివైన నువ్వు ఎలాగెలుస్తావు? మీమీ పూర్వజన్మల పూజాఫలాలు తారతమ్యాలతో మీరు అనుభవించక తప్పదు కదా!" అన్నాడు.

వ్యాసముని చెప్పిందంతా విన్నాడు అశ్వత్థామ. అతని శరీరం పులకరించింది. శివుణ్ణి ధ్యానించి నమస్కరించాడు. శ్రీకృష్ణుణ్ణి మనసారా ప్రశంసించాడు. వ్యాసమునికి పాదాభివందనం చేశాడు.

వ్యాసముని అంతర్ధానమయ్యాడు. అశ్వత్థామ తిరిగి తన రథం దగ్గరికి వచ్చేశాడు. పడమట అస్తమిస్తూన్న సూర్యబింబం చూసి దుర్యోధనుడి దగ్గిరికి వచ్చాడు. "పొద్దుగూకిపోతోంది. సైన్యాన్ని మళ్ళించు" అని హెచ్చరించాడు.

దిగాలుమనిపోతూవున్న మొహాలతో కౌరవులు శిబిరం చేరారు. పోనీ అన్ని యుద్ధవాద్యాలు మోగిస్తూ, సింహనాదాలు చేస్తూ, ఉప్పొంగిన సముద్రంలా ఉల్లాసంతో వున్న సైన్యం మళ్ళించుకుని, నిశ్చింతగా, నవ్వుతూ, కేరుతూ శిబిరాలికి వెళ్ళారు పాండవులు.

శిబిరం చేరాక అర్జునుడి గుడారానికి వ్యాసముని వెళ్ళాడు. దూరంనించే చూశాడు అర్జునుడు. తడబడిపోతూ ఎదురువెళ్ళాడు. ఎంతో వినయంతో దండప్రణామంచేసి తోడితెచ్చాడు. ఆసనమూ, అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి పూజించాడు. చేతులు జోడించి నేల మీద కూచున్నాడు. ప్రసన్నంగావున్న మునిమొహంచూస్తూ మెల్లీ మెల్లిగా ఇలా అడిగాడు: "తండ్రీ, ఎన్నాళ్ళయిమో అడగాలనుకుంటున్నాను. ఇవాళ నీఅనుగ్రహం కలిగింది. యుద్ధంలో నేను శత్రువుల్ని కొట్టడానికి పూనుకున్నప్పుడల్లా నాముందట అగ్నిహోత్రుడిలాటి

దివ్యపురుషుడు వొకడు అవుపిస్తాడు. అతడి శరీరం కిరణాలతో ప్రకా
శిస్తూ వుంటుంది. చేతిలో శూలముంటుంది. అందులోంచి ఘోరమైన
శూలాలు పరంపరగా బైలుదేరుతూ వుంటాయి. అవే శత్రువుల్ని
చంపేస్తూ వుంటాయి. నేను వెనకనించి బాణాలువేస్తూ చంపానన
కుంటాను, గెలుపు సాధిస్తూ.

"ఆదివ్యపురుషుడు ఎవ్వడో అని ఎప్పుడూ అనుకుంటూ వుం
టాను. మహాత్మా, ఎవరో అతడు?"

"అర్జునా," ఆదరంగా అన్నాడు ముని — "అదృష్టవంతుడి
వోయి నువ్వు. ఆదివ్యపురుషుడు సాక్షాత్తూ పరమశివుడు. ఆదికీ, అం
లోకాలికీ అతడే ప్రభువు. పేదకి పెన్నిధి దొరికినట్టు దొరికాడు నీ
కృతార్థుడివయ్యావు. ఆయనవల్ల ఎంతటిశత్రువయినా నాశనమవుతా
ఆయన పూనుకున్నాడు కనకనే శత్రుసంహారం అంత సులువయిం
నీకు. లోగడ దర్శనమిచ్చి, దివ్యాస్త్రాలు ప్రసాదించాడు. అంత
తనివితీరలేదు ఆమహాదేవుడికి. భక్తులంటే ఆయనకి ప్రాణం. క
ఇలా తనవాత్సల్యం ప్రకటిస్తున్నాడు. నువ్వు పుణ్యాత్ముడివి నాయనా
ఆపరమాత్ముణ్ణి ఆత్మలో నిలిపి నమస్కరించు. సర్వలోకాలికీ ఆయ
ఆశ్రయం. అతణ్ణి ఆశ్రయించు. కరుణాకరుడతడు. తన శరణార్థు
ఆయుస్సూ, ఆరోగ్యమూ, ఐశ్వర్యమూ అన్నీ అనుగ్రహిస్తాడు'
అన్నాడు.

వ్యాసముని మాటలు ఆశ్చర్యంగా విన్నాడు అర్జునుడు. భక్తి
పూర్వకంగా శివుణ్ణి ధ్యానించాడు; దండప్రణామం చేశాడు. వ్యాస
మునికి పాదాభివందనం చేశాడు.

"సుఖపడు" అంటూ దీవించి వ్యాసముని అంతర్ధానమయాడు.

వ్యావహారికాంధ్రమహాభారతం

ద్రోణపర్వం

సంపూర్ణం.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B163 |
| పుస్తకం పేరు | వ్యావహారికాంధ్ర మహాభారతం భీష్మ ద్రోణ పర్వాలు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 625 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 267a,266a ,6a |
| లేని పేజీలు | 377,378 |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | Thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |